# కలువలు

చేకుమళ్ల కామేశ్వరరావు

జనేవరి 1933



[వెల ౦—౪—౦

# తొలిమాట

ఈ కలువలు లోని ఖండకావ్యా లెప్పుడురచియించబడ్డాయో యీసంపుటంలోనే తెలియజేయబడింది. ఈఖండకావ్యాల్లో అయిదారుమాత్రం శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారిచేత రాజమహేంద్రవరంలో నడపబడ్డ 'వాణి' అను లిఖిత పత్రికలో ప్రకటించ బడ్డాయి. అటుతర్వాత రాజమహేంద్రి వరంలోనే ప్రకటించబడుతూవచ్చిన 'ఆంధ్రరాష్ట్రము'అనే పత్రికలో (ఇది కొన్నాళ్లు వారవార్తాపత్రికగానూ, కొన్నాళ్ళు మాసపత్రికగాను నడిచింది) యీ సంపుటంలోని యీక్రింది నాలుగు ఖండకావ్యాలూ ప్రకటించబడ్డాయి.

ఆంధ్రరాష్ట్రము

| | సంపుటం | సంచిక | తేదీ |
|---|---|---|---|
| ముళ్ళమొక్క | 1 | 20 | 19—1—1927 |
| తొల్లిటియాంధ్రకవులు వారలచిత్రపటములు లేమి | 1 | 21 | 26—1—1927 |
| పిచ్చిక | 1 | 24 | 16—2—1927 |
| ప్రకృతియందలినిశ్చలత్వము | 2 | 1 | అక్టోబరు 1927 |

ఈసంపుటంలోవున్న 'మరణించిన తుమ్మెదమీద—' అనుఖండకావ్యం మొదట గీతికగా రచించబడి తర్వాత కొంత కాలానికి గీతంగా మార్చబడింది. గీతికగా రాసినప్పటితేదీయే యీసంపుటంలో వేసేను.

ఈ ఖండకావ్యాల్లో శైలిసంబంధమైన చిన్నచిన్నమార్పులు అప్పుడప్పుడు చేస్తూవచ్చేను.

కవిత్వంలో నాకుగల ఆశయాలు యీఖండకావ్యాల్లో వ్యక్తపరిచేనని తలస్తున్నాను. కవిత్వరచనలో నాకుగల ఒకఆశయ మేమిటంటే, తెలుగుకవిత్వం తెలుగుభాషలోనే చెప్పాలికాని తెలుగు లిపిలో రాసే సంస్కృతంలో కాదని. ఇప్పటిపద్య కావ్యశైలి సామాన్యంగా సంస్కృతమని నాఅభిప్రాయం. నేను నాముందుంచుకొన్న ఆశయాన్ని సాధ్యమైనంతవరకూ సాధింప ప్రయత్నించేను. అసమర్థతచేత నేనుదాన్ని పూర్ణంగా వశంచేసుకోలేకపోవచ్చు: ప్రయత్నలోపంమాత్రం చెయ్యలేదు. సమర్థులైనవారికది స్వాధీనమేకదా!

గ్రాంధిక లక్షణాలలోవున్న కొన్నిఖండకావ్యాలు మాత్రమే యిప్పుడు ప్రచురించేను.

సహృదయులు ఈపుస్తకంలోవున్న తప్పులు క్షమిస్తారని తలస్తున్నాను.

8-1-1933
రాజమహేంద్రవరం.

ఓకుమళ్ళ కామేశ్వరరావు.

# పూల తీగె

చక్కఁగా సంధ్యవడుచున్న సమయమందు
ఏటిగట్టున నొక్కఁడ నేగుచుండి
మార్గమునగాక నొక్కింత ప్రక్కఁగాను
గరికమధ్యను గోముగ బెరుగుచున్న
పూలతీగెను గంటి నాపుణ్యమేమొ!
దాని మృదువగు నున్నని మేనిమీఁద
ఆకు నాకునకును మధ్య నమరియుండె,
పూర్ణచంద్రుని యందమ్ము బోలియుండి
ఫుల్లవించిన తెల్లని పుష్పములును,
రాత్రిరాలెడి మంచును త్రావినంత
పూర్తిగావికసించెడి పువ్వగమియు,
బొద్దుగా బాగ పెరిగిన మొగ్గలున్ను,
పుట్టుచుండిన సన్నని మొగ్గలున్ను.
తీవెతల్లి యీయందమ్ము నేనుజూచి
భావనా ప్రపంచమ్మున బడితినపుడు,
పలుకులకు నందగారాని భావములును

హృదయమును తెల్పలేనట్టి ముదముగల్గె.
ముదము, సౌఖ్యమ్మునందున మునిగినేను
హృదయమందున తీవెపై ప్రేమహెచ్చ
"తీవెతల్లిని సతతమ్ము కావుమ"నుచు
దేవదేవుని కరము ప్రార్థించినాను.



# ప్రకృతియందలి నిశ్చలత్వము

దిఙ్మండలముదాటి దినమణిగ్రుంకె.
పలుచని తెలికాంతి మహిమీదనిలిచె.
జేగురురంగులో చిన్ని మేఘములు
తోగినయట్టుల దోచుచునుండె.
మేఘములిట్టట్టు మెదలగలేదు,
ఆకసంబందున నతికించినట్లు
అక్కడక్కడనిల్చి యగపడుచుండె.
ప్రకృతియు మౌనంపు టాకృతిదాల్చె.
ఎట్టి నిశ్శబ్దమదెట్టి నిశ్చలత!
పంచభూతంబులు పలికికొన్నట్లు
కదలవుమెదలవు చెదరంగబోవు.
నిద్దురపోయెనో తెలియగరాదు.

వాయువున్నదొ లేక మాయమైనదియొ!
చిగురుటాకులు చెక్కుచెదరక నిలిచె.
చేలవంటలయొక్క మేలివాసనలు
చేలమీదనె నిలిచినలీలదోచె.

నిలుకడలేనట్టి నీళ్ళనుగూడ
చలియింపకుండనే నిలిచియుండినవి.
గట్లమీదనుగల చెట్లబింబములు
గౌతమీనదిలోన గాన్పించుచుండె.
నీటిపై నూరకే యాటాడుచున్న
పక్షిబింబమునీట ప్రతిఫలించినది.
అల్లరిపక్షొక టతిదూరమందు
ఆగుచునాగుచు నార్చుచునుండె.
అల్లరిచేపలు అప్పుడప్పుడును
తుళ్ళుచునీదంగ నీళ్ళదరినవి.
అంతకుతక్కిన జంతుజాలమ్ము
నోరులేనట్టులే యూరకుండినవి.
ప్రకృతియొనర్చిన మాయను తెలియ
కర్ణంబులేలకో కన్నులుచాలు.

ఎట్టి నిశ్శబ్ద మదెట్టి నిశ్చలత!
పంచభూతంబులు పలికికొన్నట్లు
కదలవుమెదలవు చెదరంగబోవు.
నిద్దురవోయెనో తెలియగరాదు.
ప్రకృతియు మౌనంపు టాకృతిదాల్చె.



# కవి; కీచురాయి.

కవి:— ఎప్పుడును నాగకుండగ చప్పుడవగ
చెవులు చిల్లులువడ నార్చు నెవరిదియని
చెట్టుపుట్టల వెదకితి పట్టుబట్టి
ధ్వనియెవినబడు నెందును కనగరావు.

తుదకు భూమిఁరొద యనుచు మది దలంచి
మిన్నకుంటిని; గాకున్న మిధ్యదేహి
యైన శబ్దమో! ఎందును గానరాక
తిరుగు లాడెడి గానమో! తెల్పరాదు.

నీదుగానము సొగసని, నీస్వనంబు
వింతయని తలచియు నేను వెదుకలేదు,
నేను జేసెడి పనులకు నేను పాడు
పాటలకు నన్నిటికి నీదు పాటశ్రుతిగ
నుండుటను, కుతూహలమున నిండినయెద
వెదకుచున్నాడ నెవతెవో వెడల బలుకు,

నీవు నీపాటనెపుడైన నిల్పినయెడ
నేను పాడెడిపాటలు నేను చేయు
పనులు నన్నియు నాగు; నామనసు కేమి
చేయుటకును దోచదుగాన చెప్పుచుంటి.
మరల నీపాట నీవును కెరలి పాడ
నేను పనులను జేతును తెలివి వచ్చి.
అట్టి శ్రుతివైన యెవ్వతెవాదువీవు?

కీచురాయి:—ఎండలోనను గాఢంపుటిరులలోన
వానలోనను పొలముల కానలందు
తిరుగుచుండెడి జీవిని, పురుగు నేను.
ఇప్పు డప్పు డనక గానమే నొనర్తు
కీచుమనుచును; నాపేరు కీచురాయి.

❖

# నిద్రకు—

చిన్ననాటను నీప్రభ నెన్నలేక
పవ్వళించితి పొత్తిళ్ల పువ్వులాగు.
ఎరిగితిని నిన్నుయింక యేమరగజాల
మరుగు నందున దిరుగాడు మాత! నిద్ర!

ప్రకృతికిని బుట్టి యామెచే బ్రతుకొసంగ
బడియు విడువక నీకృప నడుగుచుంటి.
అట్లుగాకున్న బ్రతుకగా నగునె! సుఖము
కోరగా జాలుదునె రేయి! కూర్మితనయు
నట్టుజూడంగ వలెనన్నుగట్టితల్లి!
జ్వరసమయమందు మరికొన్ని పాడువేళ
లందు నీకృప తగ్గిన గుందుచుందు.
రోగబాధయు తగ్గగ, రోజుగడపి
వచ్చురోజును జూడగ, బ్రతుకగ మరి
భూమిపై నిల్వ ఓయమ్మ! ఓమహిమల
నెలవ! యెల్లజీవులతల్లి! నేనడిగెడి
కోర్కెవినియును గొంతెమ కోర్కెచేసి

బాధపెట్టక యొసగుము వరమునింక!
మహిని నేనుందు నెన్నాళ్ళో మాత! వింటె
అంతకాలముక్షణమొక్కటైన తగ్గ
కుండతగువేళలందున యుండవలయు
నిద్ర విడువక తగ్గక తేలిపోక!



# చిన్నపిట్టయేది?

ప్రతిదినమ్ము నాతోటకు వచ్చుచుండు
చిన్నపిట్టేది? నేడేల చేరరాదొ!
దాని చిటిపొట్టి గంతులు దానియంద
మైనరూపము నేడేల కానరావొ!
సన్ననై శ్రావ్యమౌ దాని చిన్నిపాట
యేలవినరాదు? వినరా దదేల నేడు?

తెల్లపూవుల యీనిత్యమల్లిమీద
అదియు వాలియు పాడుచు నాడుచుండ
మరతు నీజగమెల్ల మైమరచి యుందు
మెలకువయు నిద్రియును నేను దెలియకుందు.
మొక్కయందమ్ము, ఆపిట్టరెక్కసొగసు,
పూలచక్కన, ఆపిట్ట లీలనడలు,
పాటమధురిమ, నాయెద పట్టగలదె?
సంత సంబంత భరియింప నగునె నాకు!
నాదు ముద్దైన సొగసు చిన్నారి పిట్ట
యేలరాదాయె? రాకుండె నేలనేడు?

మబ్బు లెడనెడ నుండ నీపవటియొండ
సూర్యుడను నెచ్చెలితో నాడుచున్న దదిగో!
తెల్లపూలతో నిండి యూని త్రైమల్లె
వేయి కళ్లతో చూచు నాపిట్టకొరకు.

ఎదురు చూచుచునున్నదీ కొదను మల్లె,
యెదురు చూచుచుంటిని యేను మిగుల,
యెదురు చూచుచు నున్న మాయిరువురనిటు
విడిచి పెట్టునో వచ్చునో వేగ మింక!

# తొల్లిటి యాంధ్ర కవులు; వారల చిత్రపటములు లేమి.

నిగనిగలాడు పూర్ణిమనాటి రేయి
తళతళమెరసెడి తారాసమూహ
మెంతదవ్వుల నుండో కాంతి వ్యాపించి
యగపడుచుండిన, నాదిమస్థూల
గోళంబు లిపుడు చక్షువులకు మిగుల
సూక్ష్మంబులై చిన్న చుక్కల బోలి
యగపడుచున్నవి, అటుగాక మీర
లో యాంధ్రకవులార! ఓకీర్తిధనులు!
ఎన్నెన్నియో వందలేండ్ల జీకట్ల
తివిరియాయుడుల మాదిరి జీల్చుచున్న
సూక్ష్మంబులవకుండ సొంపు తగ్గకయె
కాన్పించు చుందురు కవులార మీరు.

ఆంధ్రవాఙ్మయతన్వి యఘమేమిసేసె
నో యెరుగగరాదు. ఆయాంధ్రకవుల

అంతటితో బోక వ్యక్తిని చూడ
దలచుట యేలకో తెలియగరాదు.

ఎన్ని యోరీతుల నెన్నగరాని
పూజల సేయుచు భూరి కైవల్య
మును బొందుచుండెడి మనుజుడు తాను
భజన సేయుచునుండు భగవంతు జూడ
దలచుటయేలకో తెలియంగరాదు.

అద్దియె రీతిని నాయాంధ్రకవుల
పటములలో జూడ వాంఛలు గలుగు.
ఎందులకో యది యెరుగంగరాదు.
తలపునకే రాదు తెలుపంగలేను,



# వాన రాక

మెల్లమెల్లగ వచ్చి నల్లని మబ్బు
రవిబింబమునుగప్పె. భువిమీద యెండ
మాయమైపోవగ ఛాయతా జేరె.
మొగిలుమొత్తమునుండి దిగువకు వచ్చు
చల్లని తడిగాలి చయ్యన వీచె.
ఇచ్చటచ్చటనక యెగిరెను దుమ్ము.
చెట్ల కొమ్మలు నంత నిట్టట్టు నూగె.
పండుటాకులు రాలి మెండుగా నెగిరె.
ఆకసంబందున నరిగెడి పక్షి
జాలమ్ము చెట్లను గోలతో చేరె.
ఏటిలో కెరటము లేపుగ పెరిగి
పరుగు పరుగున వచ్చి దరిని డీకొనెను.
ఏటిపై బోయెడు పూరైన పడవ
గాలియెదురుకాగ కదలక నిలిచె,
చాకలి వారలు సందడితోడ,

రూపులే కటకటా! రూపుమాసినవి.

చిత్రకారుల వ్రాయుచేతు లేమయ్యె?
చిత్రించునట్టి కుంచెలు వ్రాయవేమొ!
రంగులు నష్టము వ్రాయుట కనిరో!
ఎయ్యది యెట్లున్న నయ్యాంధ్రకవుల
రూపులే కటకటా! రూపుమాసినవి.

శిల్పుల చెక్కెడిచేతు లేమయ్యె?
చెక్కెడునట్టి యాచక్కని యులులు
కనబడకుండెనో పనిసేయబోవ!
తలచి యావిగ్రహముల జెక్కబోవ
రమ్యమైనట్టి యేరాళ్ళు కన్పడవో!
ఎయ్యది యెట్లున్న నయ్యాంధ్రకవుల
రూపులే కటకటా! రూపుమాసినవి.

ఆయాకవుల పుస్తకాలను చదువు
నప్పుడు వారల యొప్పగురూపు
లనుజూడ వాంఛలు మనసులోగల్గు.
ఎందులకోయది యెరుగంగరాదు.

గున్నమామిడిమీద కూర్చుండి పాడు
కోయిల పాటను గ్రోలుచునుండి
కోయిలెక్కడ నున్నదోయని గున్న
మామిడి వెతకుట కేమి కారణము?

ఉరుముతో సమముగా తరగలు శబ్ద
మును సేయ వినుచుండి మున్నీటి చూడ
నేగుట యేలకో యెరుగంగరాదు.

గాయకు డొక్కడు కడుహాయి పాడ,
పాటల వినుచును మది సంతసించి

పంటమొక్కలకు నీరోర్వియు పాలిగావు
నీకు పుడిసెడుజల మిడనేరదు కద!
దుష్టమానవుచేష్టల కిష్టపడుచు
నుపకృతి యొనర్చు వారేరి యుర్వియందు?

మంచిమొక్కలతో బాటు మహిని నిన్ను
పెంచుచున్నది భూదేవి ప్రేమతోడ.
శిష్టపుత్రులతో బాటు దుష్టు గూడ
పెంచగా బోదె కనతల్లి ప్రేమ జూపి!



# దొంగ పిచ్చుకలు

పగటిపూటను పిచ్చిక పక్షులెన్నొ
తెరచియున్నట్టి కిటికీల తెరువులందు
నింటిలోనికి జొచ్చి మే మింట నిడిన
బియ్యపుంబుట్టలందుండి వెలికి రాలు
చిన్నగింజల ముక్కుల జేర్చికొనుచు
నాదరాకను గాంచి యొంతయును బెదిసి
యెగిరిపోవుచు నుండును మిగుల వడిగ.

ఎండరాకుండ వరుగుపై నెత్తి కట్టి
నట్టి వట్టివేళ్ళ తడికలందు చేరి
చిన్నముక్కులతో నొకకొన్ని వేళ్ళ
—తాముగూళ్ళనుగట్టగ దలచియేమొ!—
తస్కరించుచు నారాక తాము గాంచి
యెగిరి బోవుచు నుండును మిగుల వడిగ.

పైన పరచినయట్టి కంబళము మీద
వ్రాలి తమచంచువులతో కంబళముపీచు

ఆరవేసిన బట్ట లారకమునుపె
మూటలు కట్టుక బాటపై బడిరి.
పవనునివడికొంత మందముకాగ
నిశ్శబ్ద మవనిని నింగిని నిండె.
ఒక్కటొక్కటె చినుకులొప్పగ రాలి
భూమిపై వర్షమ్ము బోరున కురిసె.



# ముళ్ల మొక్క

ముందు త్రోవలో పెరిగిన ముళ్ళమొక్క!
నిన్ను త్రొక్కక వెళ్ళుటే యెన్నదగును.
క్రిందుకావింప దలచెడి మూఢజనుని
దరికిబోవక యుండుటే ధర్మముగద!

ఎంత యేపుగ బెరిగిన యెవరునిన్ను
గాంచి సంతసించెద రీప్రపంచమందు.
దుష్టమానవు నభివృద్ధి కిష్టపడెడు
పురుషులును భూమిలో లేరు ముళ్ళమొక్క!

అందమగు పుష్పతతులు నీయందు నున్న
బుద్ధిపూర్వకముగ వాని ముట్ట భయము.
సంపదలు బొందియున్న దుర్జనుని దరికి
ధనము నాసించి పోదురే ధర్మపరులు!

పీకి విదలించి నోటితో నీచు గొనుచు
నాడు రాకను గాంచి యొంతయును జడిసి,
యెగిరిపోవుచు నుండును మిగుల వడిగ.

ఇట్టు లెన్నియో రీతుల నెరుకపడక
చిన్ని చౌర్యమె పెద్దని యెన్నుకొనుచు
దొంగతనమును చేయుచు దొరకకున్న
దొంగ పిచికల నేనెట్లు భంగపరుతు?



# మరణించిన తుమ్మెద మీద—

ఏల తుమ్మెద! నీవిట్లు కూలినావు?
ఏల తుమ్మెద! నీవిట్లు రాలినావు?

నీవు నీపాట పాడుట నిల్పినంత
భూమిపై నుండి గానమే పోయె నయ్యొ!

పెల్లు పూసిన యీపూల విడిచి వైచి
భూమి బడుటకు కారణ మేమి చెపుమ?

మధువు నధికముగా ద్రావి మత్తుజెంది
పూలలో నుండలేకను రాలినావ?

ఈడుజోడైన నీచెలి కూడియుండు
సౌఖ్య మొకపరి తలపోసి జారినావ?

పూవుకన్నియ మితిలేనిమోహ మొఁవ
విషము పెట్టిన దేమిటే వెర్రి యగుచు?

ఎల్లరకు తెల్లవారు నాయినుని జూడ
తెల్లవారుచు నాకెప్డు నిన్ను జూడ.

కళల ప్రోవగు బాలుని గాంచినట్లు
తలచుచుందును నిను జూచి తనివిలేక.

నీదు సతియైన తుమ్మెద నిన్ను జూచి
ఎంత వాపోవునో యింక యేమిచేతు?

పువ్వునందుండి పువ్వుకు పోవుచుండు
దాన విదియేల నేడిట్లు మానినావు?

నిన్న మొన్నటి కంటెను మిన్నయైన
పువ్వు మొక్కటి యీప్రొద్దె పూచె నదిగో?

ముందు నీవేగి దానిని ముట్టివత్తో,
లేక నే నేగి దానిని తాకిరాన?

రమ్యమైనట్టి నీయొక్క బ్రతుకు జూచి
చావు మాటయె దలపగ జాలనైతి.

ఎన్నడును దుఃఖమెరుగని నిన్ను జూచి
జగతి నీవలె క్షణమున్న జాలు నంటి.

నేడు మొదలుంగ నాకింక తెల్లవార
బోదు ప్రతిదినమట్టుల పూలపురుగ!

ఎవరి జూచుచు బ్రతికెద నింక, యెవరి
గాంచి యుందు నీమాయాప్రపంచమందు.

పచ్చనా పూలకుం గల్గు పాటుజూచి
కనులవెంబడి నశ్రులు గారుచుండె.

ఎవరి కోసము ఇవి యింక యెదురు జూచు?
ఎవరి కోసము ఇవి యింక యెదుగు చుండు?

భామతుమ్మెద యికముందు పరుగులిడుచు
రాదు యిచటికి యెరుగుదు రాదు రాదు.

అనుచు నీరీతి నేను నామనము నందు
పగలు, రాతిరి, వేళ, ప్రపంచమనుచు
ఇదియు నదియని లేశమ్ము నెరుగలేక

అంతమే లేని శోకమ్ము నందునుంటి.
క్రమముగా నెట్టులో సాంధ్యసమయ మయ్యె.
వెలుగు వెలవెల బారుచు వెడలిపోయె.
కారుచీకట్లు దిక్కులగ్రమ్మె, జగము
పరితపించెను తుమ్మెదమరణమునకు.



# కవి, ఆరుద్ర పురుగు.

కవి:—ప్రకృతియం దన్ని వైపుల ప్రాపుగాంచు
చెట్లు, మొక్కలు, లతలు పూచె కుసుమముల
కనుల పండువ యీ పచ్చగడ్డి చూడ
ఇందు నెఱ్ఱగ మెరిసెద వెవరు నీవు?

ఆటలాడుచు పాడుచు నరుగుదెంచి
గడ్డి కోయుచు నుండొక కాపుపిల్ల
దాని పవడాల చేరులు నలిగి తెగగ
పడియిచటను రంజిల్లెడి పవడమేమి?

పాట పాడుచు తిరుగుచు వచ్చియిచట
గడ్డి కోయుచు నుండొక కాపు పడుచు
దాని జడతాడు కొస నొక తరహాపట్టు
ఉన్న దది యిట ఊడిపడి యున్న దేమి?

ఇటన్నె, యీగడ్డి క్రిందనె యెవడో కాపు
కూతునొకతెను విడిచి యా గోరి మీద
పేర్మి తీరంగ జల్లె గుర్వింద లెన్నొ
అందులోనుండి విడిన గుర్వింద వేమి?

కావు లిందండె గుడిసెల గట్టుకొనిరి.
సంజ వడుటచె నేదియో గంజి త్రావ
వంట చేయుచునున్నారు. మంట నుండి
గాలి కెగిరివచ్చిన నిప్పుకణము వేమి?

కలదు మన భూమినే రత్నగర్భ యనుట
అదియు నెఱుగుదు, వెట్టులో అవని గర్భ
భేదనముగాగ బయటికి వెలుగు తోడ
నింపుగా నరుదెంచిన కెంపు వేమి?

ఏను మెరుగక నిన్నిట్లు ఎన్నియైన
ప్రశ్నలను వేసితిని. కాని వాని వలన
కోప మింతేని బూనక కోరివచ్చి
నట్టి నను కృతార్థుని జేయ నడుగు చుంటి.

ఆరుద్రపురుగు:—ఓకవి! విను నేనెరిగింతు నాకథను, ర
వంత పనివడి యడిగిన వాడ వగుట.
ఈ ఋతువు నందు నీచేల నీవనముల
దేవదేవుని కరుణచే దిరుగుచుండి
బ్రతుకు చుందును. ఎర్రని రంగు దాన,
పోవ సెలవిమ్ము, ఆరుద్ర పురుగు నేను



# పిచ్చిక

పగలెల్ల పొలముల పై బడి తిరిగి
దొరకిన గింజల పురుగుల దినుచు
ఇనుడు గ్రుంకక మున్నె తనగూడు చేరి
యిచ్చమై నిద్రించు పిచ్చిక యొకటి
వేకువ జామున వేగమె లేచి
నేను నిద్రించెడు నిలయంబు చెంత
కర్రపై గూర్చుండి అర్రెత్తి పాడె.
నన్ను లేపింపంగ పన్నిన పాటో?
దారి తప్పిన యట్టి ధవు గానలేక
వానిని పిలిచెడి పాటయే యగునో!
తన పాట సొబగును నా కెరింగింప
పాడిన పాటయో పచియింప జాల.
ఒక్కటే రీతిని ఒక్కటే పాట
విడువక నుసుగక వినిపింప దొడగె.
కారణ మూహగంగ కడువడి నేను

వెడలితి నవ్వుచు పిట్ట చెంతకును.
ప్రశ్న వేయగ లేదు, పలుకనే లేదు.
వింటిని పాటని వివరింప లేదు.
మాట నొకటైన పలుకక మును పె
తుర్రున పిచ్చుక దూరము వారె.
ఏమి కారణమొ నే నెరుగంగ జాల
చెప్పుము బాలకా! చెప్పుము నీవు.



# ప్రణయమా! నీవు లేకున్న బ్రతుకలేను.

అదిగో! యెవ్వడో మనుజుడు కదలి పోయె.
ఇహము విడిచి యెందేగెనో యెరుగ లేము.
చెంతనున్నట్టి బంధువుల్ చెలులు, వాని
చుట్టు నుంజేరి విలపించు చున్నవారు.
ఆర్తనాదము నా చెవు లాక్రమించి
గుండె కలగించి మనసును క్షోభ పెట్టె.
చేరుగడ కొరకే టునటు వారుచుంటి.
ప్రణయమా! నీవు లేకున్న బ్రతుకలేను.



# తీర్పరాని లోటు

గొప్పగ్రంధ మొకటి నేను కోలుపోతి:
దాని ప్రతిని విలిచితెచ్చి నాను అపుడె.

కష్ట పడియు చేర్చి ధనము నష్టపోతి:
చింతపడక మరల సొత్తు చేర్చికొంటి.

పాడుచున్న కోకి లొకటి పారిపోయె:
వేరు పికము కెరలి పాడ వింటినేను.

మేటి మొగిలు దృష్టిపథము దాటిపోయె:
మరల గంటి నట్టి మొగిలె తరలిరాగ.

రమ్యమైన పుష్ప మొకటి రాలిపోవ:
అట్టి పువ్వె మరల చెట్టునందుగంటి.

| ఖండకావ్యం పేరు | రచించిన తేదీ |
|---|---|
| పూల తీగె | 7- 9-1928 |
| ప్రకృతి యందలి నిశ్చలత్వము | 13- 1-1927 |
| కవి, కీచురాయి. | 10-10-1926 |
| నిద్రకు——. | 2-11-1931 |
| చిన్నపిట్ట యేది? | 23- 2-1932 |
| తొల్లిటి యాంధ్రకవులు; వారల చిత్రపటములు లేమి. | 20-10-1926 |
| వాన రాక | 20- 8-1928 |
| ముళ్ల మొక్క | 11- 1-1927 |
| దొంగ పిచ్చికలు | 21- 2-1927 |
| మరణించిన తుమ్మెద మీద——. | 13- 7-1926 |
| కవి, ఆరుద్ర పురుగు. | 11-10-1926 |
| పిచ్చిక | 15- 1-1927 |
| ప్రణయమా! నీవు లేకున్న బ్రతుక లేను. | 23- 8-1926 |
| తీర్చరాని లోటు | 26- 9-1926 |

పై ఖండకావ్యాలన్నీ రాజమహేంద్రవరంలో వుంటూ వుండి నప్పుడే రచించ బడ్డాయి.